# విజ్ఞప్తి.

ఆర్యులారా!

నేనీ తిరుమల వేంకటేశ్వరశతకమును రచించుటకు, నాకా దేవదేవునియందుగల భక్తివిశేషమే కారణముగాని, నాకుగల భాషావైదుష్యమును వెల్లడింపగాదు. మీదుమిక్కిలి కవిత్వరచనకు వలయు సామగ్రి నాకడ నపూర్ణమని నేనెఱింగియు రచనకు సాహసించితి. ఇందొప్పులెన్నియో తప్పులెన్నియో గ్రహింపజాలని యల్పజ్ఞుడను. నీరు పాలును గలిపి నివేదించిన పాలనే గ్రహించి నీటిని విసర్జించు హంసరాజము మాడ్కి సదయహృదయులగు మీరు నాయందుగల వాత్సల్యాతిశయంబున నాతప్పులను మన్నించి, మీకృపకు నన్ను పాత్రునిజేయ వేడుకొనెద.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

గుడ్లదొన, 25-10-38.

త్వరకవి మాలెకొండరాయడు,
గ్రంథకర్త.

శ్రీరాములు.

శ్రీ తిరుమల వెంకటేశ్వర ప్రసాద సిద్ధిరస్తు.

# శ్రీ తిరుమల వెంకటేశ్వర శతకము.



ఉ॥ శ్రీరమణీయగాత్ర, సర ♦ సీరుహపత్రవిశాలనేత్ర, ప।
ద్మారమణీకళత్ర, పుర ♦ మర్దన మిత్ర, సురారి జైత్ర, వి।
స్తారసుకీర్తిపాత్ర, విధి ♦ సంస్తుత చిత్రచరిత్ర, భక్తహృ।
త్సారసనూత్నమిత్ర, ముని ♦ సన్నుత తిర్మల వెంకటేశ్వరా॥ ౧

ఉ॥ శ్రీద, భవత్కృపా మహిమ ♦ చేగృతినొందు రచింపఁబూని, మీ।
పాదసరోజయుగ్మమును ♦ భావమునన్ గడుభక్తి నిల్పి, యా।
మోదముతోఁ నుతింతు, రస ♦ పూరితపద్యశతంబుఁ గూర్పఁగన్
సాదర మొప్ప సాయమును ♦ సల్పుము తిర్మల వెంకటేశ్వరా॥ ౨

ఉ॥ ఒక్కఁడనైన విఘ్నముల ♦ నొందక గార్యభరంబుఁ దీర్పఁగా,।
మ్రొక్కెద మీదు నానతిని ♦ మోదుగఖాదికి విఘ్నరాజుకున్,।
చక్కెరలొల్కు పల్కులను ♦ శారదనాకొడఁ గూర్చునట్లు పెం।
పెక్కిన భక్తితోఁ గొలుతు ♦ నెప్పుడు తిర్మల వెంకటేశ్వరా॥ 3

ఉ॥ ఆదిమకావ్య కర్తను, ♦ వ్యాసునకున్, భవభూతికాళిదా,।
సాదులకాంధ్ర వాఙ్మయని ♦ యంతల కంజలిచేసి మ్రొక్కెదన్,।
నాదగు తల్లి దండ్రుల క ♦ నారతమున్ బ్రణమిల్లి వేడుదున్,।
బ్రోది దయొసంగి నాకృతిని ♦ బ్రోవఁగ తిర్మల వెంకటేశ్వరా॥ ౪

ఉ॥ రూపమునామమున్ గ్రియయు ♦ లోకహితార్థముఁ బూనితో జగ।
ద్వ్యాపకనీ నిజమ్ముజల ♦ జాసనరుద్రముఖామకోత్తముల్ ।

దాపసవర్యులున్ గనగ ♦ దక్షులుగాక వినమ్రచిత్తులై ।
తేపకు దేపకున్ నినును ♦ తించిరి తిర్మల వెంకటేశ్వరా ॥ ౫

ఉ॥ ఆదియుగత్రయంబునని ♦ జాశ్రితభక్తజనానుపాలనా ।
మోదవిశిష్టచిత్తమున ♦ మోహవిదూరుడవయ్యు మోహివై ।
మేదినిజన్మమందితివ ♦ మేయచరిత్ర తురీయమందునన్ ।
గాదిలివిగ్రహంబవయు ♦ గ్రాలితి తిర్మల వెంకటేశ్వరా ॥ ౬

ఉ॥ స్థూలములందు స్థూలమయి, ♦ సూక్ష్మములన్ గడుసూక్ష్మరూపివై,
నేలకునింగికిన్ మిగిలి ♦ నిండిచరాచర విశ్వమంతయున్ ।
లోలతనుండుదేవ, భవ ♦ ఖండనపండిత విగ్రహంబవై ।
గ్రాలితిమానవప్రతతిఁ ♦ గావఁగఁ దిర్మల వెంకటేశ్వరా ॥ ౭

ఉ॥ కంటిని యేడుగొండలను, ♦ గంటివరాహుని దివ్యదేశమున్, ।
గంటిసువర్ణ కుంభముల ♦ గ్రాలెడుకోవెల గోపురంబులన్, ।
గంటివరాహతీర్థమును ♦ గల్మషహారిణియందుఁ గ్రుంకితిన్ ।
గంటిభవత్ప్రతీకమును ♦ కాంక్షతో తిర్మల వెంకటేశ్వరా ॥ ౮

ఉ॥ క్రుంకితి పాపనాశమునఁ, ♦ గ్రుంకితినాకధునీ జలంబులన్ ।
గ్రుంకితి గోవృగర్భమున, ♦ గ్రుంకితి పాండవతీర్థమందునన్, ।
గ్రుంకితి బ్రహ్మతీర్థమున ♦ గ్రుంకితి విష్ణుమహేశ్వరంబులన్, ।
గ్రుంకితి కాపిలాఖ్యమున ♦ గూర్మితో తిర్మల వెంకటేశ్వరా ॥ ౯

ఉ॥ లెక్కకు మిక్కుటంబగుచు, ♦ కేలుబవళ్లును దాసకోటి పెం ।
పెక్కిన భక్తియుక్తులయి ♦ హృద్యము లాగిరి సప్తకంబుపై ।
కెక్కుచు గ్రిందికిన్ దిగుచు ♦ నేగుటచూచినఁ గండ్లపండువౌ ।
స్రుక్కెడు వారు లేరుముర ♦ సూదన తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౦

ఉ॥ మందిర ఘంటికారవము ♦ మందమరంద రసైకవంతమై, ।
బంధురపాపసంచయవి ♦ భంజనశక్తి విశాలవంతమై, ।

యిందిర కాత్మ భూతమయి ♦ యింపెసలారెడు నామమైనగో
విందయటంచు వీనులకు ♦ విందగు తిర్మల వెంకటేశ్వరా ॥



ఉ॥ నీదగు దివ్యదర్శనము ♦ నిర్మలనిశ్చలచిత్తవృత్తి నా ।
పాదనఁజేసి, భక్తిరస ♦ వంతముగాఁ గురుబుద్ధిఁగూర్చి కా
మాదివిరోధులన్ దరిమి, ♦ యవ్యయసౌఖ్యమునిచ్చి, ముక్తిసం ।
పాదనకారణంబగుచు ♦ భాసిలు దిర్మల వెంకటేశ్వరా ॥ ౧౨

ఉ॥ శుకపిక సంకులంబగుచు ♦ శోభిలుచుండు వనాంతరంబులన్ ।
ప్రకటితసాధసంహతి వి ♦ రాజిత పట్టణభూములందు నో ।
ల్లక, నివసింప నెంచి తో ♦ ధరాధర వల్లిత భూరికాననం ।
బకలుషిత స్థలంబని ద ♦ యామయ తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౩

ఉ॥ కారడవయ్యె సత్వములు ♦ గానఁగరావు మహత్వమెట్టిదో ।
దారినసర్పబాధయును ♦ తస్కరబాధయు లేమసౌఖ్యమై ।
మారుత మొప్పుచుండు రవి ♦ మండల తీక్ష్ణమయూఖదాహముల్ ।
భూరుహశాఖలార్పు ముని ♦ పూజిత తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౪

చ॥ నినుఁగనఁబోవు భక్తుల వి ♦ నిశ్చలచిత్తమెఱుఁగఁగోరియో ।
ఘనమతి దేవమానివర ♦ కాండ మొనర్చెడు బూజలందనో ।
మనసున నేమి యెంచితివొ ♦ మానవకోటికి సేవ్యమైన యీ ।
వనమునఁజేరినావు సుర ♦ వందిత తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౫

చ॥ సిరిగలవాడవంచు, నిజ ♦ సేవకబృంద ఘనాఘపుంజసం ।
హరణవినోదివంచు, కరు ♦ ణాకర భావుడవంచు, నెమ్మదిన్ ।
గురుతరమైనభక్తినినుఁ ♦ గూర్చి భజించితి నన్నుఁబ్రోవుమో ।
పరమదయాసముద్రముని ♦ పూజిత తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౬

చ॥ మలకలధర్మవృత్తియని ♦ మానకమచ్చర పూరితాత్ములై ।
పిలుచన హైందవాలయవి ♦ భేదనకార్యధురీణులై వెసన్ ।

జెలగియునీదు సన్నిధికి ♦ జేరగలేరది యేమిచిత్రమో।
సలలిత సద్గుణాఢ్యముని ♦ సన్నుత తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౭

చ॥ మలకలతేనిపట్టి, సుర ♦ మానవవంద్య గుణప్రకాశ,మా।
నళినదళాక్షిసన్నిభ, స ♦ నాతన ధర్మపథానువర్తి, నీ ।
వలచిభజించి సద్యశము ♦ భద్రపదంబును గాంచగల్గెనే।
వెలదులుసాటి యాసతికి ♦ పృథ్విని దిర్మల వెంకటేశ్వరా ।

ఉ॥ శ్రీకమలామనోహర, శ ♦ చీవరముఖ్య దిగీశపాలనా ।
స్తోకయశోవిశాల, ముర ♦ సూదన, వేదవిరోధవాదకా।
నేకపయూథకుంభచయ ♦ నిర్దళనోగ్ర మృగేంద్ర, భక్తలో ।
కైకశరణ్య మంగళ గు ♦ ణాలయ, తిర్మల వెంకటేశ్వరా ॥

ఉ॥ కుండలవైరివాహ, ముచి ♦ కుందనుతా, హరినీలదేహ కో ।
దండకళాప్రచండ మద ♦ దానవకాండవిభంగ భండనా, ।
చండకరేందునేత్ర భవ ♦ సాగరతారణ యానపాత్రనీ ।
యండననన్ను జేర్చుగొని ♦ యాదెద తిర్మల వెంకటేశ్వరా॥ ౨౦

ఉ॥ యజ్ఞము, యజ్ఞభోక్తవును ♦ యజ్ఞఫలంబును నీవెకానెరు ।
ప్రాజ్ఞులు నమ్మి కొల్చి భవ ♦ బంధవిమోచను లౌదురన్ననీ ।
యాజ్ఞశిరంబుచన్దిడి య ♦ హంబుద్రుంచి దినంబునేమనో ।
యజ్ఞమొనర్చు దత్ఫలము ♦ నందగ తిర్మల వెంకటేశ్వరా॥ ౨౧

ఉ॥ పాండవ పక్షపాతివని ♦ పల్కెడు కౌరవులెంతమూర్ఖులో, ।
దండధరాత్మరూపమగు ♦ ధర్మమునీవని కాంచలేకనీ ।
కుండునెయట్టి దానగుణము ♦ యోగిజనాశ్రయ, సత్యమూర్తివై।
నిండు వెలుంగునీ వెగడ ♦ నిర్మల తిర్మల వెంకటేశ్వరా ॥ ౨౨

ఉ॥ వేదహరుండు సోమకుడు ♦ బేలతనబ్ధిమునింగిడాగ, బ్ర ।
హ్మాదులు నిన్ను వేడమను ♦ జాతునిగూల్చితి మత్స్యరూపివై ।

వేదచయంబు బ్రహ్మకిడి ♦ భీతిని బాపి ధరన్ జెలంగవా ।
సాదల బెంగఁ బాపఁగల ♦ సామివి తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౩

చ॥ సురహిత మాచరింప, వడి ♦ సుళ్లను వార్ధిమునుంగనున్న మం ।
దరమును వీపుపై నిలిపి ♦ దక్షత మోసిన కూర్మరూపనా ।
తిరమెనుతింప నీమహిమ ♦ దక్షసు తేశుడె జాలఁడందురో ।
పరమదయాంతరంగ ముని ♦ వందిత తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౪

చ॥ తరమర యంగలేక, గను ♦ దర్పితుఁడై కనకాక్షుఁడుగ్రతన్ ।
బిరబిర చాపచుట్ట గతి ♦ బృధ్విని జుట్టఁగ బూనఁ గ్రోధివై ।
కెరలి వరాహరూపమున ♦ గిల్బిషునద్దనుజున్ వధించి స ।
త్వరమున బ్రోవవే ధరను ♦ భాసుర తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౫

ఉ॥ సోదరహంతకున్ దునిమి ♦ క్షోణితలంబున కెల్ల నీశుడై ।
మోదముఁ జెంద నెంచి కడు ♦ మూఢతనున్న హిరణ్యకశ్యపున్ ।
మేదురవక్షుఁనున్ జిదిమి ♦ మిత్తిక్రొసంగిన నారసింహా, ప్ర ।
హ్లాదనుతాబ్జపాద, కరు ♦ ణాకర తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౬

చ॥ బలరిపునోర్చి, నాకమును ♦ బాయగఁ జేసి, సురాధివాసమున్ ।
బలిమిని నాక్రమించి, తన ♦ పౌరుషమెల్లెడ సాటినట్టి యా ॥
బలిని నడంచు పూనికను ♦ వామనమూర్తిగ బ్రహ్మచారివై ।
వెలసిన దేవదేవ, పర ♦ భీకర తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౭

చ॥ ధరణిపు లేపుమీఱి ♦ నిజధర్మములన్ విడనాడి దుష్క్రియా ।
పరతజరింప నిసుగొని ♦ పార్థివలోక వినాశకారివై, ।
పరగితివయ్య లోకమున ♦ భార్గవరాముఁడు నాబ్రశస్తమై, ।
సరసవచోవిలాస, ముని ♦ సన్నుత తిర్మల వెంకటేశ్వరా ॥ ౧౮

ఉ॥ ఊర్జితశక్తి సాహసము ♦ దోర్దళిభండన నిర్జితారివై ।
దుర్జయుఁడైన రావణుని ♦ దోర్బల జృంభణ మార్పఁగోరి మేల్ ।

కర్జమెఱింగి, దాశరథి • గన్బరిభవించి దశాస్యుగూల్చవే ।
నిర్జరలోకవంద్య, ధర • నీవర తిర్మల వెంకటేశ్వరా ॥ ౨౯

చ॥ హాలముధరించి హస్తమున • యాదవయోధులకెల్ల దొడ్డవై ।
బలశివ్రవైభవోన్నతుఁడు • పాలిత పార్థుఁడుచక్రి కన్నవై ।
యలరితివయ్య రోహిణికి • నానకదుందుభికాత్మజుండవై ।
బలయుత రామనామమున • భాసిలి తిర్మల వెంకటేశ్వరా ॥ 30

ఉ॥ సంతతభోగలాలసత • త్న్మాతలి భూతదయావిహీనులై ।
జంతుబలి ప్రదానమున • శాంతిలి దేవగణంబు కామితం ।
బెంతయొగూర్చి బొత్రుతురచు • హేయగుణాఢ్యుల నాద్దరింపగన్ ।
భాగ్యంని బాపి, బుద్ధుఁడన • భాసిలు తిర్మల వెంకటేశ్వరా ॥ 3౧

చ॥ కలియుగమందు మానవుల • గల్మషదూరులఁ జేసి ప్రోవఁగన్ ।
దలచితో, యాత్మరూపమున • ధారుణి శేషనగోత్తమంబునన్ ।
వెలసితి కల్కిమూర్తివన • వేడుకమీర గృపారసాంబుధీ ।
కలిమివెలంది జేఁడబుధకల్పక తిర్మల వెంకటేశ్వరా ॥ 3౨

చ॥ నినుఁగనుఁలారఁగన్న గడు • నీరసమైఘన పాపసంచయం ।
బనలము సోకుశుష్కతృణ • మట్టులు గూపతిపోవునంచు స ।
ద్ఘనులువచించు వాక్యములు • తథ్యముగా మదినమ్మికంటినీ ।
సనకసనందనాదిముని • సన్నుత తిర్మల వెంకటేశ్వరా ॥ 33

॥ దుర్మతి మానవాధములు • దుష్టమత ప్రవిబోధితోగ్రిదు ।
ష్కర్మలనాచరింప, భువి • సంకరజాత్యభివృద్ధిఁజెందఁగా, ।
నిర్మల హైందవాభ్యుదయ • నిశ్చల తత్త్వముసాటి బోధివవే, ।
ధర్మము తూరంబరా, సుజన • పాలక, తిర్మల వెంకటేశ్వరా ॥ 3౪

ఉ॥ దేవ, భక్తిప్రియారచన, • ధీవిభవంబును, భూతతత్త్వముల్, ।
జీవుఁరాత్మవైక్యము, • చేతన చేతన సృష్టితత్త్వముల్, ।

కేవల నిర్గుణంబ, రిజ • గీపయు, సత్వరజస్తమాదులన్, |
భావమునన్నెఱుంగుటయె • పాప్రిజ్ఞత తిర్మల వెంకటేశ్వరా ॥3౫

ఉ॥ భక్తియుతాంతరంగులయి, • భాగవతార్థ విచారమగ్నులై |
వ్యక్తివశంబు జేసి, నిగ • మాంతునినిన్ను నిశంబుగొల్చినన్ |
ప్రాక్తనపాపసంహతిని • బాసిభవాబ్ధిదరించి, దుర్నయ |
వ్యాప్తిదొరంగి గాంచెదరు • హాయిని తిర్మల వెంకటేశ్వరా॥3౬

చ॥ కరధృతశంఖచక్ర, కలి • కల్మషనాశన గండకీశిలా |
వరయుత హేమహార, ముఖ • బాసితచారుతరోర్ధ్వపుండ్ర, వి |
స్ఫురదరవిందరాగమయ • భూరికిరీట, సువర్ణఘంటికా |
భరితకటిప్రదేశ, ముని • వంద్రిత తిర్మల వెంకటేశ్వరా ॥ 3౭

చ॥ వరద, భవాబ్ధిపోత, శశి • భాస్కరలోచన, పాపమోచనా |
శరనిధిగేహ, నీలమణి • సార విరాజితచారుదేహ, సం |
గరనిహతాసురప్రకర, • కల్యగుణాశ్రయ, కంబుకంధరా |
స్ఫురదరవిందనేత్ర, ముని • పూజిత తిర్మల వెంకటేశ్వరా॥3౮

ఉ॥ సారసగేహినీహృదయ • సారస సారసమిత్ర, ఘోరసం |
సారవిచారదూర, ఘన • సారసుగంధవిలేపనాంగ, ధీ |
సారవిరాజితా, విజిత • శాత్రవ, రక్షితశాత్రవాత్మజా |
సారసవైరి వక్త్ర, ముని • సన్నుత తిర్మల వెంకటేశ్వరా ॥ 3౯

ఉ॥ గ్రాహనిపీడితంబగుట • గ్రార్యముబెంచి మదేభ మొక్కెడన్ |
సాహసమొప్పఁబోరి తన • సారము బీరము బాసి ప్రాణముల్ |
దేహముపీడనున్నఁగడు • దీనతనీశరణమ్ము వేడినన్, |
స్నేహముమీరఁ బ్రోచితివి • నిర్మల తిర్మల వెంకటేశ్వరా॥ ౪౦

ఉ॥ కార్ముక భంగముంతువగ • గల్పనజేసి విదేహరాజు, దా |
నర్మిలిభూమిజాపరిణ • యంబును సాటిన, రాట్కుమారులా |

ధర్మముగాంచి బెగ్గడిలి, • తాఁకగనోడ, దృణంబులీలఁగా |
మర్మమెరింగి ద్రుంచినర • మా వరతిర్మల వెంకటేశ్వరా ॥ ౪౧

ఉ॥ మోసపుజూదమందు తమ • భోగము, రాజ్యము నోడికాననా |
వాసవి శేషకష్టపరి • బాధిత భావులు పాండుసూనులా |
యాసముబాఁసి, శుద్ధహృద • యమ్ముల నీపద పూజజేసి, పెన్ |
గాసినిబాఁసి, సౌఖ్యమును • గాంచిరి తిర్మల వెంకటేశ్వరా॥ ౪౨

ఉ॥ గొల్లడనీవటంచు భువి • గొల్లలు గొందరు బల్కుచుండ్రు, నీ |
వెల్లజగంబులో విసృజి • యించినవాఁడని గాంచలేక, నీ |
కల్లనిజంబులన్ దెలిసి • కాలము బుచ్చుటెపూరుషార్థమో |
ఫుల్లసరోజనేత్ర, కరి • పోషక తిర్మల వెంకటేశ్వరా ॥ ౪౩

చ॥ ధరణిని భక్తసంహతిని • దారత బ్రోవవికుంఠమందిరం |
బరయఁగఁవీడి, శేషనగ • మందునబుట్టితివుట్టలోపలన్, |
హరుఁడునజుండు గోవులయి • యయ్యెడనీకు బయస్సునిచ్చుటన్ |
గురుతుగగాంచె దద్విధము • గొల్లకు తిర్మల వెంకటేశ్వరా॥ ౪౪

ఉ॥ గొల్లడు, తొండమాన్నృపతి • గోవులకాపరి, ధేనుకంఠముల్ |
డుల్లగనేయ గొడ్డలిని • దోస్థలి జేర్చిననాలఁ గావనీ |
పల్లనమంచి నీశిరము • నడ్డముగా బెనువేటునందిరన్ |
వల్లవుఁడుల్కిపాటొదవి • పర్వడె తిర్మల వెంకటేశ్వరా ॥ ౪౫

చ॥ ధరణిపపుత్రి పద్మయను • దామరసాక్షివరించి వేడుచున్ |
బోఁపారిమ్రొక్కపూర్వభవ • పుణ్యవశంబున గేలువట్టినీ |
వరమరయింతలేక భవ • దర్థశరీరమునన్ ధరించితో |
గరుడతురంగ, భక్తజన • కల్పక, తిర్మల వెంకటేశ్వరా ॥ ౪౬

చ॥ ధరయును, నీళయున్, సిరియు • ధర్మసతీత్రితయంబు, గొల్వగా
పరమపదంబు శేషనగ • పావనకానన సీమయైకృపన్ |

పరలితివయ్య దాసజన ♦ వాంఛితముల్ సమకూర్పనెంచి, నా।
తరమనుతింపనిన్నుఁగడు ♦ ధార్మిక తిర్మలవెంకటేశ్వరా ॥ ౪౭

చ॥ తురగముఖంబుదాల్చి, తొలి ♦ దొల్తన నక్షరసంజ్ఞఁగూర్చితీ।
వరుసనినాల్గువిద్యలకు ♦ నాదిగురుండవు, వేదమూర్తివీ।
వరయ ననాదిపూరుషుఁడ ♦ వాద్యుఁడ వబ్జభవాండసృష్టికిన్ ।
వరఖగరాజవాహ సుర ♦ వందిత తిర్మలవెంకటేశ్వరా॥ ౪౮

ఉ॥ తల్లియు దండ్రియున్ గురువు ♦ దాతయు త్రాతయునీవెయంచునా
యుల్లమునందునమ్మి విన ♦ యోక్తుల నీపదపూజసేతునీ।
చల్లనిచూపులన్ బరపి ♦ సత్యమునిత్యమునైన సౌఖ్యమున్ ।
గొల్లగనిచ్చి బ్రోవునను ♦ గూర్మిని తిర్మలవెంకటేశ్వరా ॥ ౪౯

ఉ॥ పర్వతమెక్కు త్రోవకిరు ♦ పార్శ్వములన్ వికలాంగు లెందరో ।
విర్విగ బార్లుతీరి, చను ♦ ప్రేక్షకు లిచ్చెడు కాసువీసమున్ ।
బర్విడిగొంచు జీవితము ♦ భద్రమటంచును దృప్తులై సదా ।
నిర్విషయాత్ములైమనిరి ♦ నిర్మల తిర్మలవెంకటేశ్వరా॥ ౫౦

ఉ। దేవ, నరాకృతిన్ బడసి ♦ దేవిగఁబద్మను గేలుబట్టనా ।
పావనిపుణ్యమేమొ, మది ♦ భావనసేయఁదరంబె, తొండమాన్,
భూవిభుడాచరించిన త ♦ పోబలమల్లుని జేసె నిన్నహో ।
పావనివంద్యసప్తగిరి ♦ పాలక తిర్మలవెంకటేశ్వరా॥ ౫౧

చ॥ సుతుబడయుంగఁగోరి కపి ♦ సుందరియాంజన యంజనాద్రిపై ।
యతితపమాచరింపఁగని, ♦ యంబరకేశుని వీర్యమున్ సదా ।
గతిభవదాజ్ఞ నావనిత ♦ గర్భమునందిడునట్లుజేసి, యా ।
సతి ముదమందఁగూర్చితివి ♦ సంతతి తిర్మలవెంకటేశ్వరా ॥ ౫౨

చ॥ పుడమిని నేధనాఢ్యుడును, ♦ భోగియు,త్యాగియు, జక్రవర్తియున్
బడయగలండె నీకుసరి ♦ భాగ్యము, భోగము, నాధిపత్యమున్ ।

విడిపడకుండనిత్యమును ♦ వేనవవేలు గడింతు ద్రవ్యముల్ |
గుడినిగడాని పూతలను ♦ గొల్పితి తిర్మలవెంకటేశ్వరా ॥౧౩॥

చ॥ ఒకకరమందు చక్రమును ♦ నొక్కటశంఖముదాల్చి పేర్మిమై |
యొకటనుజూపిపాదముల ♦ నొక్కటభక్తులవాంఛితార్థముల్ |
సకలమునిచ్చు చిహ్నముగఁ ♦ జాచి చెలంగితి వేఁకుగొండలన్ |
ప్రకటమహాగుణాఢ్య, ♦ ముని వందిత తిర్మలవెంకటేశ్వరా॥ ౧౪

ఉ॥ ఆజినినోడి శాత్రవుల ♦ కర్థము, దేశముగోలుపోయి, కాం|
భోజనృపాలుఁడర్థినిను ♦ బొల్పుగనర్చనజేసి, రాజ్యముల్ |
వాజిగజధ్వజాదుల న ♦ వార్యతగైకొని, మేరుధీరుడై |
రాజిలెగాదె యుర్వర, ప ♦ రాత్పర తిర్మలవెంకటేశ్వరా ॥ ౧౫

ఉ॥ పూర్వము మాధవుండనెడు ♦ భూసురుఁడాత్మకులోచితక్రియా |
నిర్వహణంబుమాని యువ నీ ♦ స్థలి దుర్వ్యసనానుషంగుడై |
పర్వమునాడు నీదరికి ♦ బ్రాప్తవశంబున జేరిగొల్వ గా|
సర్వఘనాఘముక్తునిగ ♦ సల్పితి తిర్మలవెంకటేశ్వరా॥ ౧౬

చ॥ ధరమునురామకృష్ణుఁడను ♦ తాపసు డుగ్రతపంబు సేయుచో |
వెలిచి సురేంద్రుఁడత్తపము ♦ భిన్నముసేయ గడంగి బన్నముల్ |
బరువడినొడ్డ నీకరుణ ♦ బ్రాపుగనిల్పి మునీంద్రు బ్రోచితో |
వరద, సమస్తలోక పరి ♦ పాలక, తిర్మలవెంకటేశ్వరా॥ ౧౭

చ॥ శరణమటన్నవారలకు ♦ శాశ్వతసౌఖ్యమునిచ్చిబ్రోతువన్ |
బిరుదుగలాడవంచు నిను ♦ వేడితి నాహృదయంబులోన నీ |
వరపదకంజముల్ నిలిపి ♦ వారక నీకృపజూపకున్న నీ|
బిరుదుహుళక్కియందు నరి ♦ భీకర తిర్మలవెంకటేశ్వరా॥౧౮॥

ఉ॥ కృత్యమటంచుదారకుని ♦ గీటడగించి కుమారదేవుఁడా |
హత్యదొలంగుటెట్లనుచు ♦ నాత్మదలంచి సురేంద్రునాజ్ఞచే |

నిత్యము, సత్యమై నెగడు ♦ నిన్ భజియించి యఘంబు బాయఁడే।
వ్యత్యయమింత లేక నత ♦ భార్గవ తిర్మల వెంకటేశ్వరా॥ ౫౯

చ॥ భవదభిషేకతీర్థమును ♦ బానమొనర్చెదు మానవాళి య।
త్యవిరళదోషసంభవ ఘ ♦ నాఘవితానవిముక్తినొందు నీ।
వవని సమస్తతీర్థముల ♦ కాలయమై విలసిల్లుచుండుటన్।
వివిధకళావినోద, బల ♦ భిన్నుత తిర్మల వెంకటేశ్వరా॥ ౬౦

ఉ॥ శీతలమందవాత మగ ♦ సీమ విరాజిత పారిజాత భూ।
జాతసుమప్రభూత నవ ♦ సౌరభసార మిళద్దిగంతమై।
యాతపతాపహంబగు మ ♦ దావహమై ప్రసరించి యెంతయో
ఖ్యాతివహించె నీనిలయ ♦ మందున దిర్మల వెంకటేశ్వరా॥ ౬౧

చ॥ విమలమనీష నీవు దల ♦ పెట్టిన నొక్కక్షణంబులోపలన్।
గమలభవాండజాలముల ♦ గల్పన జేతువు మాయజూతువ।
భ్రమమునజోగి, భోగిగను, ♦ శక్రునిభిక్షువుగా నొనర్తువో।
సమయవినోదజాల కజ ♦ సన్నుత తిర్మల వెంకటేశ్వరా॥ ౬౨

చ॥ సనకసనందనాదిముని ♦ సత్తములర్మిలి శేషశైలమం।
దనుపమలీల నిన్నుగొని ♦ యాడిభజించి, భవద్విభూతులన్।
దినకరతుల్య తేజమును ♦ దివ్యమనోహరగాత్రసంపదన్।
గనులకు బండువౌనటులు ♦ గాంచిరి తిర్మల వెంకటేశ్వరా॥ ౬౩

చ॥ వ్రజమునగోపసుందరుల ♦ ప్రక్కన నందరికన్నిరూపులై।
నిజశుభమోహనాకృతిని ♦ నెగ్గగఁజేసి, విభాసరాసమున్।
బుజుగతిసల్పుచో నిశివ ♦ రుం డుడుమధ్యమునన్ దనర్చు న।
ట్లజనుతయొప్పితయ్యా, సుజ ♦ నావన తిర్మల వెంకటేశ్వరా॥ ౬౪

ఉ॥ ఎల్లజగంబులోలి సృజి ♦ యించను, బెంచను, ద్రుంచఁగర్తలై।
చెల్లినమూర్తులన్ వెసర ♦ చింపగుణాత్మకుఁడైన నిత్యునే।

వల్లనుగాంచఁగా గలనొ, ♦ పాపుఁడనే, గతిజూపనీవు నా।
యుల్లమునందునిల్వుమిక ♦ నిర్మల తిర్మలవెంకటేశ్వరా॥ ౬౫

చ॥ శివుఁడనికొందరుఱ్, ♦ గనకచేలుఁడటంచును గొంతిమందియుఱ్।
ద్వివిధవిధానవర్తులయి ♦ తీవ్రవివాదపరంపరాహతిఱ్।
జివికెదరయ్య, దేవ, నిను ♦ చిన్మయుఁడద్వయుఁ డంచు నెమ్మదిఱ్।
దవిలియెఱుంగలేక, గడు ♦ ధార్మిక తిర్మలవెంకటేశ్వరా॥ ౬౬

ఉ॥ పాలితలోకజాల, కరి ♦ పాలక, పావనివంద్య, పావనా,।
నీలశిరోజజాల, హరి ♦ నీలమణీనిభచారుగాత్ర, నీ।
లీలలెఱింగిగోపికలు ♦ లేలు బవళ్ళుభజించి యత్నియు।
శ్రీలనుగాంచిసత్పదము ♦ జేరిరి తిర్మలవెంకటేశ్వరా॥ ౬౭

ఉ॥ సేవకలోకపాల, సుర ♦ శేఖరవంద్య, సుశీల దేవకీ।
దేవి కనుంగుబాల, వసు ♦ దేవ నృపాలవరాత్మజోల నా।
భావమునందు నీదుపద ♦ పద్మయుగంబును నిల్పినిత్యముఱ్।
బ్రోవుమటంచు వేడెదను ♦ బొల్పుగ దిర్మలవెంకటేశ్వరా॥

ఉ॥ లోకులు, లోకనాయకులు ♦ లోకములుఱ్ బదునాల్గుమాయమై।
చీకటిగ్రమ్మ నవ్వలను ♦ జిత్ప్రభ కోటిదివాకరాభమై।
జోకనఖండమై వెలుగు ♦ సూరిజనంబు లెఱుంగనేర్తురా।
ప్రాకటతత్వమీవయను ♦ భావము తిర్మలవెంకటేశ్వరా॥ ౬౯

ఉ॥ పాఱుడొకండునీవనిని ♦ బాటనబోవుచు దాఁరిదప్పి దు।
ర్వారపిపాసచే బడలి ♦ ప్రాణమువాయగనుండి, తానిను౯।
గూరిచివేడ, సత్కృపను ♦ గ్రోలగనీరమునిచ్చి, యింటికి౯।
దారి నెఱుంగజూపితివి ♦ ధార్మిక తిర్మలవెంకటేశ్వరా॥ ౭౦

ఉ॥ వేడగలేదురాజ్యములు ♦ విత్తములుఱ్ గజవాజువంబులుఱ్।
వేడికి శ్రీనివాస కడు ♦ పేదతవంబువనుంట, బొట్టకు౯।

గూడును, కట్టబట్టయును, ♦ గూరిమినీపదదాస్యముల్ సదా।
పోడిమి మీరనిచ్చి నను ♦ బ్రోవుము తిర్మలవెంకటేశ్వరా॥ ౨౧

ఉ॥ నీపదపద్మసేవనము ♦ నిర్మలచిత్తునిజేసి, బుద్ధికిన్।
బ్రాపుగనిచ్చి, భక్తికిని ♦ బాసటయై పరమార్థదృశ్యముల్।
జూపగ హేతువై వెలయు ♦ జొప్పడనాకది మార్గమెద్దియో।
తోపగలేదు, దిక్కగుము ♦ దోడన తిర్మలవెంకటేశ్వరా॥ ౨౨

ఉ॥ భారతయుద్ధవీరుడగు ♦ పాండవమధ్యముడాహవస్థలం।
బారసి, తన్నుడై, గురుల, ♦ నాప్తుల, బాధుల జంపనోడి తా।
బోరికిబూనకున్నయెడ ♦ బోధనజేసితి కర్మయోగముల్।
ధీరత గయ్యముల్ గడప ♦ ధీవర తిర్మలవెంకటేశ్వరా॥ ౨౩

ఉ॥ గాదిలితమ్ముడాజి దశ ♦ కంఠునితో నెమకొడ్డి వ్రెళ్ళ దు।
ర్వేదనమొంది, దుఃఖమున ♦ వేగితి, ప్రాకృతపూరుషుంబలెన్।
సోదరధర్మసూత్రము వ ♦ సుంధరమానవులాశ్రయింప నా।
మాదిరి సల్పితౌర, నిజ ♦ మాయది తిర్మలవెంకటేశ్వరా॥ ౨౪

చ॥ నవరసభావసంభరిత ♦ నవ్యవచోసువిలాస సంపదన్।
ప్రవిమలతేజముల్ గలిగి ♦ భామినివై సుధబంచి పెట్టవా।
నవనవలాకు పల్లవక ♦ నద్రుచిబొల్చుకరాంబుజంబులన్।
వివిధకళావినోద బల ♦ భిన్నుత తిర్మలవెంకటేశ్వరా॥ ౨౫

ఉ॥ కాలునిమూతలార్భటికి, ♦ కాయముగంపముసొంది ప్రాణముల్।
దూలెడువేళ నీస్మరణ ♦ దోచునొ, తోచదొ శ్రీనివాస, యీ।
వేళనె జేతునయ్య, మది ♦ వేసటజెందక నాటికడ్డమై।
జాలిసెలంగి బ్రోవవలె ♦ శాశ్వత తిర్మలవెంకటేశ్వరా॥ ౨౬

చ॥ నవనిధులున్న, రంభయగు ♦ నాతినిగొన్న, దివంబుగన్న నో।
ప్రవిమలతీర్థపాద, కడు ♦ భక్తిని నిన్ననిశంబుగొల్వకన్।

భువి నెవఁడేని నీకరుణఁ • బొందఁగ లేఁడని విన్నహేతువన్ ।
దివిరిభజింతు నిన్ను, గడ • తేర్చుము తిర్మలవెంకటేశ్వరా॥ ౨౭

చ॥ రవిశశిభౌమసౌమ్యులును, • రాత్రిచరాదిగురుండు, కావ్యుఁడున్ ।
రవిజుఁడు, రాహుకేతువులు • బ్రాభవమొప్పఁగ నీదునాజ్ఞచే ।
యువని నరాళికర్మఫల, • మందగఁ జేయుట, బూజనార్హులై ।
ధ్రువగతినొప్పుచుండుదు ర • ధోక్షజ తిర్మలవెంకటేశ్వరా॥ ౨౮

చ॥ సతమని యాలుబిడ్డలును, • సంపద, భోగము, వాహనంబులున్
మతినతిగర్వమున్ జెలఁగి, • మత్తత భూతదయావిహీనుఁడై ।
కృతమకృతంబుగానకను • గిల్బిషవృత్తములాచరించెడా ।
పతితుఁడు, కాలుసమ్మెటల • బాలగు దిర్మలవెంకటేశ్వరా॥ ౨౯

ఉ॥ ఆనతవైరిపార్థునకు • నాప్తుఁడవై, రథచోదకుండవై ।
మానితహృత్ప్రియుండవయి • మంత్రివినై, గురునాయకుండవై
మేనమఱందివై, జగతి • మేటిబలాఢ్యునిజేసికాఘనున్ ।
గానకళావినోద, సుర • నందిత తిర్మలవెంకటేశ్వరా॥ ౩౦

ఉ॥ కత్తినిజేతబట్టక నె, • కవ్వడికిన్ రథచోదకుండవై ।
మిత్తికిద్రోయఁగల్గితి వ • మేయబలాఢ్యులధార్తరాష్ట్రులన్ ।
బత్తియె మూలకారణము • పాండవపక్షచరుండవౌటకున్ ।
చిత్తమునగన్నవారలకు • నేమము తిర్మలవెంకటేశ్వరా॥ ౩౧

చ॥ సరసవచోవిలాసముల • శయ్యను లక్ష్మినిగూడియుండఁగా ।
కరిమొఱనాలకించి తమ • శంబున నక్రపదార్థమేగుచో ।
పరుగులు బారినావట న • భామినిపయ్యెద నైనవీడకన్ ।
పరమదయామసీమ, నుత • పాండవ తిర్మలవెంకటేశ్వరా॥ ౩౨

చ॥ ఎఱిగి, యెఱుంగ కేనకట • యెంతటిపాపము సేసినానొ యా ।
వఱకు, నికేమిజేసెదనొ • ప్రాప్తమదెట్లొకొ తోఁచదయ్యొ, నీ ।

మఱుగుకు జేరినాఁడ, నను ♦ మానమువీడి, కృపాకటాక్షముల్ ।
బఱపి, మదాశ్రయుండవయి ♦ భాసిలు తిర్మల వెంకటేశ్వరా॥౮3

చ॥ అనిశము నీపదార్చనము ♦ నర్మిలిసేయుచునున్న నామెడల్ ।
గనికరమూనవేల, నను ♦ గావఁగ రావదియేల, పామరుం ।
డని యెదనెంచినావొ, పరి ♦ హాసము నాదుచరిత్ర లేకనీ ।
మనము శిలామయంబొ ♦ గిరిమందిర తిర్మలవెంకటేశ్వరా ॥౮౪

ఉ॥ ఆసకు మేరలేక నడి ♦ యాసలబాలయి, నీచసేవలన్ ।
జేసి, కృతాపరాధినయి ♦ చేడ్పడి యిబ్యెడ పూర్వపుణ్యముల్ ।
జేసి, భవత్పదార్చనము ♦ సేయఁగగల్గితి నాదుపాపముల్ ।
ద్రోసి పునీతుజేయుమయ ♦ తూర్ణమ తిర్మల వెంకటేశ్వరా॥౮౫

ఉ॥ 'రా'యని యుచ్చరించిన బ...లాయనమౌ దురితంబులన్నియున్ ।
'మా'యనిబల్కినంత క్షణ♦ మాత్రములో, దలవాకిలొయ్యనన్ ।
మూయబడంగ లోజొరగ ♦ బోలవుగావున రామనామమున్ ।
బాయక సంస్మరించుటయె ♦ భద్రము తిర్మలవెంకటేశ్వరా॥౮౬

చ॥ సిరిగలవాఁడవౌట నిను ♦ జేరిభజించిన వారికెప్పుడున్ ।
గురుతరమైన సంపదల ♦ గూర్చియనంబుల మోహవార్ధిలో ।
దరగల ...క్కజేయకను ♦ ధర్మనిబద్ధ గుణావలంబులై ।
బరగఁగజేసి బ్రోతువట ♦ భాసుర తిర్మలవెంకటేశ్వరా॥ ౮౭

చ॥ తలపును నీపయిన్నిలిపి ♦ తావకనామ సుధారసంబు నిం ।
పలరగ గ్రోలువారలకు ♦ హాయిజెలంగు నిహంబునన్ సదా।
వెలయుదు రూర్ధ్వలోకముల ♦ విశ్రుతసౌఖ్యములబ్బి ముక్తులై।
సలలిత స్వప్రకాశ, గుణ ♦ శోభిత తిర్మలవెంకటేశ్వరా॥ ౮౮

చ॥ అవనిపుడైననేమి, బల ♦ హంతకు డంతటిభోగియైన నే ।
మవిరళ దానశీలుడయి ♦ యఖ్యాతుండయి యేమి ధాత్రిలో ।

భవదభిమానముఁ గొనని ♦ పామరుఁ డవ్విధి పాత్రుఁ డౌను, తా|
భవజలధిన్ దరింపఁ గురు ♦ పండిత తిర్మల వెంక టేశ్వరా॥ ౭౯

చ॥ కలియుగమందు గొందరతి ♦ కల్మషమానసులౌట దుష్క్రియా|
కలితుల సత్యవాక్పరుల ♦ కారణవైర వశీకృతాత్ములై |
బలిమిని పేదసాదలకు ♦ బాధలుగూర్చుచునుంద్రు వారలన్ |
బొలియఁగఁ జేసి సాధువులఁ ♦ బ్రోవుము తిర్మల వెంక టేశ్వరా॥ ౮౦

చ॥ వనజదళాక్ష, యోగివరద ♦ వాసవవంద్య, దయాంతరంగ, స|
న్మునికుల సేవితాంఘ్రియుగ ♦ మోహనరూప, సురారిమర్దనా |
ఘననిభనీలకాయ, దర ♦ కంధర, నందకుమార, వల్లవీ |
వనరుహబాణ, నీలగళ ♦ వందిత, తిర్మల వెంక టేశ్వరా॥ ౮౧

చ॥ నినుగనలేనివాఁడు కడు ♦ నీరసుఁడై కనులుండియంధుఁడౌ |
ననువుగనీకథామృతము ♦ నాననిదుష్టుఁడు ప్రేతమాత్రుఁడౌ |
నినుమది సేవలన్ దనుప ♦ నేరనివాఁడిల గార్ధభంబగున్ |
దినకరసోమలోచన సు ♦ ధీవర తిర్మల వెంక టేశ్వరా ॥ ౮౨

చ॥ ఇనుఁడుదయింప జీకటులు ♦ హీనములై కనురెప్పపాటులో |
జను పటుమాయమై యటులు ♦ శాస్త్రవిచారసుబోధసారమున్ |
గనినను బాయునజ్ఞత, వి ♦ కాసముగల్గు మనంబు కెంతయున్ |
జనహితకార్యమియ్యదియ ♦ త్మాకలి తిర్మల వెంక టేశ్వరా॥ ౮౩

చ॥ జనహితమైనకార్యములు ♦ సల్పుచు భూతదయాంతరంగుఁడై |
యొనర సువర్ణలోష్టముల ♦ నొక్కటిగా సమదృష్టిగాంచుచున్ |
దనమది దానెఱింగి కుల ♦ ధర్మపరాయణుఁడౌచు భూస్థలిన్ |
మనుటయె పూరుషార్థ ♦ మఘమర్షణ తిర్మల వెంక టేశ్వరా॥ ౮౪

చ॥ ధీవరుఁడైన పూరుషుఁడు ♦ దేశము, గాలము, బాత్రమున్, సదా |
భావమునందు గుర్తెఱిఁగి ♦ పథ్యము దథ్యమునైన ద్రోవసే |

శోభగనేర్చినాఁ జగతి • బూజ్యత గాంచఁగ నర్హుఁడయ్యెదుఁ |
శ్రీవర భక్తమానసవ • శీకర తిర్మలవెంకటేశ్వరా ॥ ౯౭

ఉ॥ క్రోలితినీకథామృతము • గ్రోలితి నీపదకంజతీర్థముఁ |
దోలితి వైరిషట్కమును • దూరముగా వెసరొడ్డకుండ దే |
వాలయమందు వెల్గు పర • మాత్మ నిగంటి నిమీలతాక్షులఁ |
జాలము దృశ్యవిశ్వమని • సాటితి తిర్మలవెంకటేశ్వరా॥ ౯౮

ఉ॥ మాడలు, మానికంబులు స • మంజసభూష లమూల్యచేలముల్ |
గోడిగె,లాలు, పల్లకులు • కుంజరముల్ రథముల్ పురంబులుఁ |
బోడిమిమీర లంచమిడు • పూనిక నాయెడసున్న, చేతులఁ |
మోడిచి మ్రొక్కగల్గుదు న• మోయని తిర్మలవెంకటేశ్వరా॥ ౯౯

చ॥ జనులతినీతిమంతులయి • సత్యవచోవిభవాభిరాములై |
జనపతి ధర్మమూర్తియయి • సస్యములెందు ఫలప్రదంబులై |
యునికికి మన్కికిఁ జగతి • యూర్జితసౌఖ్య ముదావహంబునై |
దనరగఁజేసి బ్రోవుమయు • ధార్మిక తిర్మలవెంకటేశ్వరా॥ ౧౦౦

ఉ॥ అంగజకోటి సన్నిభశు • భాంగ, భవన్మృదుపాదయుగ్మముఁ |
సంగతభక్తి హృద్విమల • సారసపీఠిని నిల్పి పూజలు |
పొంగుచుజేసి నీదయను • బొందగనే నివుడియ్యనున్న యీ |
మంగళహారతిఁ గొనుము • మాన్యత తిర్మలవెంకటేశ్వరా॥ ౧౦౧

చ॥ త్వరకవివంశసంభవుఁడు • దారుఁడు, శౌనకగోత్రవర్ధనుం |
డరయగ నారువేలకులుఁ• డాత్మగురుండు సదాన్నదానత |
త్పరుఁడు భవద్విధేయుఁడు సు • భావుడు వెంకటరామమంత్రియా
పరసుని యాత్మకీవలయు • సౌఖ్యము తిర్మలవెంకటేశ్వరా॥ ౧౦౨

చ॥ పిలువఁగ మాలకొండడనుఁ • బేరటివాఁడ కవీశ్వరాఖ్యుఁ
దొలఁగియు వ్రాసితిఁ గృతిని • దోఁచినయట్టులు పండితోత్తమ
సెలువుగఁబద్యముల్ సదివి • చిత్తములన్ గడుహర్షమొంద
తెలపునఁ జూడుమయ్య భవ • తారక తిర్మలవెంకటేశ్వరా॥

శ్రీ తిరుమలవెంకటేశ్వరార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక.



| పద్యసంఖ్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౩ | ౧ | ఉ | చ |
| ౨౦ | ౧ | కుఁడల | కుండలి |
| ౩౭ | ౨ | బాసిత | భాసిత |
| ౩౮ | ౪ | స్ప | స్ఫ |
| ౪౦ | ౪ | దృంచిన | ద్రుంచిన |
| ౫౩ | ౩ | విడిబడ | విడివడ |
| ౬౫ | ౧ | చ | ఉ |